ఓమ్.

శారదారత్నమాల. ౫

# సభారంజనము.



# పీఠిక.

జగద్విఖ్యాతుఁడగు శ్రీమదప్పయ్యదీక్షితుని మనుమఁడును శివలీలార్ణవ గంగావతరణ నలచరిత్రాద్యనేకశతాధిక గ్రంథకర్తయు మఱియు శైవదీక్షాపరుఁడును నగు మహాకవి శ్రీ నీలకంఠదీక్షితునిఁ దుదకు విని యైన నెఱుఁగని సారభాషాభ్యాసకు లుండరను టతిశయోక్తి కానేరదు. ఆ మహాకవి సభారంజనశతకత్రయ మను పేరఁ గలివిడంబనము, సభారంజనము, వైరాగ్యము నను త్రిశతశ్లోకములను భర్తృహరివలె వృత్తములలోఁగాక పాఠకసుబోధార్థ మనుష్టుప్ఛందస్సులో నాతికఠినముగను మృదుమధురముగను రచియించి సారభారతి నలంకరింపఁజేసెను. ఒకప్పు డొకమిత్రుఁడు "నీలకంఠదీక్షితునిలఘుకావ్యము" లనుగ్రంథ మొండు నా కొసంగి యుండెను. మిత్రదత్త మగుపొత్తము నస్మద్భాండాగారమునఁ జేర్పక గ్రంథాదియందే కూర్పఁబడిన కలివిండంబనశతకమును జదువ మొదలిడితిని. చదువుచున్న కొలఁదియు శతకత్రయంబును దెనిఁగింపవలయు నను నారాట మెక్కుడై కీగ్రంథరూపమున్ దాల్చినది. ఈ శతకత్రయంబును గలిపిగఁజేర్చి ముద్రింపించుటయే నా యభిప్రాయ మైనను గారణాంతరములవలనఁ బ్రత్యేకించి ముద్రించు టావశ్యకమాయెను. మహాకవి రసపుష్టియు భావశబలతయు రసికులు గాంచి యానందించెదరుగాక యని మూలశ్లోకములును

నిందుఁ జేర్పఁబడినవి. రసికుల యానందమే ప్రతిఫలముగాఁగల నా యీ వ్యవసాయము కొంతవఱకేనియు ఫలవంతమైనచో నే ధన్యుఁడను. మహాకవి కాలచరిత్రాదికములను గ్రంథాంతరమున విపులముగఁ జర్చింపఁ దలంపుఁగొన్నవాఁడ నగుట నిపుడు మానితిని.

అనమనమూరు
అగ్రిహారం
ఈశ్వర శ్రావణము.

ఇట్లు
బుధవిధేయుఁడు
మక్కపాటి వేంకటరత్నకవి.

## ఒకమాట

సికిందరాబాదు వాస్తవ్యులు సరళ స్వభావులు, రసికులు నగు రాజశ్రీ బచ్చు వీరన్న గారు మాతృభాషాభిమానులుగావున ౧౦౦ ప్రతులకు సరిపడు కాగితముల నొసంగి యీ కావ్యముద్రణమునకు నాకుఁదోడ్పడిరి. సరసు లగువీరికిని, వీరి కుటుంబమునకును బరమేశ్వరుఁ డనారత మాయురారోగ్యభాగ్యము లొసంగి చిరము రక్షించుగాక.

ఇట్లు
గ్రంథకర్త

## మంగళాచరణము

అమృతరుచిరంబు దివ్యగుణాలవాల
వాక్యగర్భిత మఖిలసేవ్యంబు సరల
చంపకామోదభరితంబు శస్తసౌందర్య
రామణీయక మీ కృతిసరోజము దిటవు
గనుత మజరామరత కాలకాలుకరుణ.

## కృ తి స మ ర్ప ణ ము.

నీలకంఠమహాకవినిర్మితంబు
శ్రీ సభారంజనాఖ్యప్రసిద్ధశతక
రత్నమున కాంధ్ర మిది నాదురచన మెలమి
శివపదాబ్జాతభృంగ మై చెలఁగుగాత.

## ప్రార్థన

నీలకంఠమహాకవినిరుపమాన
సత్యభారతి కంజలుల్ సంఘటింతు
నస్మదావనపీఠమం దధివసించి
నవనవోజ్జ్వలవాక్ప్రసూనములు గురియ.

## విక్రయమునకు సిద్ధముగనున్న గ్రంథములు.

| | |
|---|---|
| ద్రౌపదీమానసంరక్షణము (నాటకము) | రు. 1-0-0 |
| కాశీసారము (శంకరాచార్యకృతికిఁ దెనుఁగు) | 0-4-0 |
| చారుచర్య (క్షేమేంద్రునికృతికిఁ దెనుఁగు) | 0-6-0 |
| శివధ్యానసుధానిధి | 0-4-0 |

---

## అచ్చగుచున్న గ్రంథములు.

సుభాషితరత్నమాల

వైరాగ్యము

కలివిడంబనము

సుభద్రాకల్యాణము

గంగాలహరి.

మక్కపాటి వేంకటరత్నకవి
కవితావిలాసము
అనమనమూరు,
(via) ONGOLE.
M. S. M. Ry.

# శుద్ధపత్రము.

| పుట | పద్యము | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| ౧౬ | ౩౭ | ౧ | అమ్యర్తాః | అమర్త్యాః |
| ౩౧ | ౫౯ | ౧ | దున్ను చంద్రు | దున్ను చుంద్రు |
| ౩౭ | ౬౩ | ౧ | కప్రసూతే | కఃప్రసూతే |
| ౪౪ | ౮౫ | ౩ | దాన్యై | హాన్యై |
| ౫౩ | ౧౦౩ | ౩ | భూరమణునుఁ | భూరమణుఁ |
| ౫౫ | ౧౦౬ | ౩ | కాంద్ర | కాంధ్ర |

సభారంజనము.

షడ్దర్శనీపరిజ్ఞాన
మస్త్రైరివ శస్త్రైః
స్తమ్భై శ్చిత్రై ర్వినా తాం నైశోభ
సభాకిమవభాసతే

౨

సన్తి సర్వవిధామర్త్యా
నసన్త్యేకేపపశ్చితః
అసూర్యేణేవ లోకేన
కింతేన విషయేణానః.

౩

ఉద్యన్తు శతమాదిత్యాః
ఉద్యన్తు శతమిన్దవః
నవినా విదుషాంవాక్యై
ర్నశ్యత్యాభ్యన్తరంతమః.

౪

బహుభోజ్య బహుబోద్ధవ్యం
బహుభా బహువాసరాః
బహుకల్పశతస్థాయి
లబ్ధం బహువిధంయశః

౫

౧

గీ॥ అఖిలశాస్త్రార్థ నిష్ణాతు లైన విబుధ
సత్తములచేత నలరారు సభవిధాన
చిత్రిత స్తంభ సువితాన శ్రీవిరాజి
తం బగు సభాతలము శోభితంబు గాదు.

౨

గీ॥ వసుధలో సర్వవిధములవారు గలరు
గాని పండితుఁ డొక్కఁ డందు గలుగు టరిది
కాన భాస్కరరహితలోకంబు భాతి
కలుగ దేతత్ప్రదేశమువలన ఫలము.

3

గీ॥ ఇనశతం బొక్కమా ఉదయించుగాక
విధుశతం బొక్కటను బ్రభవించుగాక
పండితుని తత్వహార్ప్రభాపత్తి లేక
తలుగ దణుమాత్ర మేని యాంతరతమస్సు.

౪

గీ॥ జగమునను జరస్థాయి యశంబుఁ గూర్పఁ
దలఁచువాఁడు బహుకాలము తత్పరతను
సత్సమూహంపు శుశ్రూష సలుపవలయు
నెంతయో తెల్వితోఁ జరియింపవలయు.

౫

౫

పాషాణాః సర్వ ఏవైతే
పద్మరాగేషు కో గుణః
ప్రకాశః కశ్చిదత్రాస్తి
పరత్ర స చ విద్యతే.

౬

జాత్యన్ధా జాతిబధిరా
జాతిమూకాశ్చ తే జనాః
సమ్యగారాధితా యైర్న
సన్తో విజ్ఞానసింధవః.

౭

అపి మానుష్యకం లబ్ధ్వా
భవన్తి జ్ఞానినో న యే
పశుతైవ వరం తేషాం
ప్రత్యవాయాప్రవర్తనాత్.

౮

కిం పరోక్షం కిమధ్యక్షం
కిం లభ్యం కిం ను దుర్లభమ్
సర్వమైన్ద్రియికం వస్తు
సర్వం కరగతం సతామ్.

౯

౫

గీ॥ సర్వ మారయఁ బాషాణజాతియె కద
వనజరాగంబునం దేమిగొనము కలదు?
అన్యపాషాణనిచయంబునందు లేని
హృద్యతమ మైన తేజ మొం డెసఁగుదాన.

౬

గీ॥ అమితవిజ్ఞానసింధువు లైన బుధుల
దెలిసి వారి నారాధింపఁ దలఁప రెవరు
వారె సూ జనుషాంధులు వారెజన్మ
బధిరులును బుట్టుమూఁగలు వారె ధరణి.

౭

గీ॥ ధరణి నెవ్వాఁడు మాన షత్వమును గనియు
జ్ఞానసము పార్జ నైకయత్నమున మనఁడో
వానికన్నను బశుత యే వరము తలఁప
బ్రిత్యవాయాఢ్య ప్రివ ర్తనత్వంబు చేత.

౮

క॥ ఇది సులభం బిది దుర్లభ
మిది యధ్యత్యంబు మఱియు నిది కాదనిలే
దెది యైంద్రియికంబగున
య్యది యెల్లను బండితునకు హా స్తగతం బౌ.

౯

తత్రతత్రస్థితైర్జ్ఞాన
కరణైరివవిగ్రహైః
విద్వద్భిశ్శోభితే దేశ
స్సైర్విహీనస్స్వమంగలః

౧౦

స్థావరా జఙ్గమా మర్త్యా
బ్రాహ్మణా మునయః సురాః
శివ ఇత్యప్యమీ భేదా
శ్చిదుత్కర్షనిబన్ధనాః.

౧౧

విద్యుజ్జలధరో వృష్టి
శ్చన్ద్రార్కా సాగరా ఇతి
సర్వమద్భుతమజ్ఞానాం
జానతాం తు న కించన.

౧౨

అమలీమసమచ్ఛిద్ర
మక్రేయమతిసున్దరమ్
అదేయమప్రతిగ్రాహ్య
మహో జ్ఞానం మహాధనమ్.

౯

గీ॥ అచ్చటచ్చటజ్ఞానేంద్రియములు గలుగు
విగ్రహము శోభిలెడునట్లు విబుధజనము
లటనటఁ జెలంగు దేశ మత్యంత మలరు
లాతి దేశ మమంగళాన్విత మగును.

౧౦

గీ॥ స్థావరములును జరములుఁ జనులు జగతి
సురులు ఋషులును దివిజులు పురహరుండు
ననెడు భేదము చిత్ప్రభావాతిశయతఁ
గలిగినదిగాని వేఱొండు గాదుసుమ్ము.

౧౧

గీ॥ చంచలలును సూర్యుండును జంద్రుఁ డబ్ధి
జలధరాసారములు మూఢజనుల కద్భు
తమును గూర్చుచుగాని సంతయును బ్రాజ్ఞ
జనులకు వికారమును గూర్పఁజాలవెపుడు.

౧౨

గీ॥ కరము సుందర మప్రతిగ్రాహ్య మమల
మొరుల కీరాని దెప్పు డెవ్వరికి నేని
విక్రయింపంగ రానిది విగతదోష
మరయ విజ్ఞాన మనెడు మహాధనమ్ము.

౧౩

సందర్భశక్తి హీనానాం
శబ్దాభ్యాసో వృథాశ్రమః
ముగ్ధాని లబ్ధ్వా పుష్పాణి
ముణ్డితః కింకరిష్యతి?

౧౪

శాస్త్రేషు దుర్గ్రాహ్యోఽప్యర్థః
స్వదతే కవిసూక్తిషు
దృశ్యం కరగతం రత్నం
దారుణం ఫణిమూర్ధని

౧౫

ఆంజస్యం వ్యవహారాణా
మార్జవం పరమంధియామ్
స్వాతన్త్ర్యమపి తన్త్రేషు
సూతే కావ్యపరిశ్రమః

౧౬

సాహిత్యవిద్యాహీనానాం
సర్వశాస్త్రవిదామపి
సమాజం పరిపశ్యన్తి
సమజం బుద్ధిశాలినః

౧౩

గీ॥ సరససందర్భహీనుల శబ్దసేవ
సంతతంబును నిష్ప్రయోజనము సుమ్ము
ధారణార్థంబులు మనోజ్ఞసౌరభంబు
లలరుదండలు పట్టిన న్యాసి కేల?

౧౪

గీ॥ అరయ శాస్త్రాళి దుర్గ్రాహ్య మైనవిషయ
మెలమిఁ గవిసూక్తి నాస్వాదలలిత మగును.
ఫణిఫణాగ్రస్థితంబు భీప్రదముగాని
కరమునందున్న మణి మనోహరముగాదె?

౧౫

క॥ మనుజునకు బుద్ధిసూక్ష్మత
యును వ్యవహారమున నేర్పు యోజనముల నె
క్కొను స్వాతంత్ర్యము నలవడు
ననయము సత్కావ్యసమ్యగభ్యాసమునన్.

౧౬

గీ॥ ఇతరశాస్త్రంబు లఖిలంబు నెఱిఁగికొన్న
యేని సాహిత్యవిద్యావిహీన మైన
యా సమాజము సమజమ ట్లాత్మ నెంతు
రనయమును శేముషీధను లైన వారు.

౧౭

అశిక్షితానాం కావ్యేషు
శాస్త్రాభ్యాసో నిరర్థకః
కిమ స్త్యనుపనీతస్య
వాజపేయాదిభిర్మఖైః

౧౮

అర్థా విద్వజ్జనైర్హీనా
మూకా కవిభిరుజ్ఝితా
బధిరా గాయకైర్హీనా
సభా భవతి భూభృతామ్.

౧౯

సాహిత్యాదపి శాస్త్రాణి
విశిష్టానీతి చేన్మతిః
తతోఽపి వేదాధ్యయనం
తతోఽపి శివకీర్తనమ్

౨౦

సన్త్వశ్వాః సన్తు మాతఙ్గాః
సన్తు యోధాః సహస్రశః
నారేంద్రాణాం విశేషేణ
న వినా కవినా యశః

౧౦

౧౭

గీ॥ కావ్యముల శిక్షితాత్ముఁడు గాని వాని
యఖిలశాస్త్రాభ్యసనము నిరర్థకంబు
వాజపేయాదిమఖములవలన నేమి
యనువుపడఁగల దనుపనీతునకు జూడ.

౧౮

గీ॥ వసుమతీపాలకుని సభాభవనసీమ
కవివరేణ్యులు లేక మూఁగయును గాయ
కాగ్రణులు లేక బధిరంబు నఖిలశాస్త్ర
విదులు వెలిగాఁగ నంధమై వెలయు నకట

౧౯

గీ॥ జగతి సాహిత్యమునకంటె శాస్త్రచయము
సరసనీతిదమంచు నెంచంగ నైన
నంతకంటెను వేదాధ్యయనము వరము
దానికన్న గిరీశకీర్తనము ఘనము

౨౦

క॥ వేలకొలంది గజంబులు
వేలు తురంగములు మఱియు వేలు భటులు భూ
పాలునకుఁ గలిగె నేనియుఁ
బోలఁగ కవిలేక కీర్తిపొసఁగ దెవ్వనికిన్.

౨౧

౨౧

కాన్తాః కమలపత్రాక్షాః
కదర్యాః కల్పశాఖినః
కాతరా విక్రమాదిత్యాః
కవిదృగ్గోచరం గతాః

౨౨

పారదేశ్యం పృథాదాస్యం
పంచానామేకదారతా
పాండవానామభూత్కీర్త్యై
పారాశర్యకవేర్గిరా.

౨౩

జానాతే యన్న చన్ద్రార్కౌ
జానతే యన్న యోగినః
జానీతే యన్న భర్గోఽపి
తజ్జానాతి కవిః స్వయమ్

౨౪

సర్వసామపి విద్యానాం
సాహిత్యం హి కవేః పరమ్
సాధారణ్యేఽపి యత్రైవ
సారస్వతపదం ధ్రువమ్.

౨౧

గీ॥ సత్యవీంద్రుని దృష్టిప్రసార మొనసి
విక్రమార్కత్వుఁ డయ్యెడుం బిరికిపంద
అమరపాదప మగును లుబ్ధాగ్రసరుఁడు
పుండరీకాక్షుఁ డయ్యెడుం బుట్టుగ్రుడ్డి.

౨౨

గీ॥ పాండవుల కేకదారత్వపారదేశ్య
దాస్యము లమేయనిందాస్పదములై యైన
వ్యాసకవిరాజసిద్ధవాక్యములవలన
ననితరోదాత్తకీర్తిసాధనము లయ్యె.

౨౩

గీ॥ సూర్యచంద్రు లెద్దానిని జూడలేరొ
పరమయోగీంద్రు లెద్దాని నరయలేరొ
ఎట్టిదాని సర్వజ్ఞుఁడు నెఱుఁగలేఁడొ
అట్టిదానిని సుకవి తా నరయఁగలఁడు.

౨౪

గీ॥ ఎల్లవిద్యలయందు సాహిత్యమొకఁడె
ప్రాణపద మైనయది కవివరుల కవని
పదము "సారస్వతం" బొకపాటి యైన
నెల్లయందునఁ ధృవమ్ము సాహిత్య[illegible].

౨౫

నామరూపాత్మకం విశ్వం
దృశ్యతే యదిదం ద్విధా
తత్రాద్యస్య కవిర్వేధా
ద్వితీయస్య చతుర్ముఖః

౨౬

నాదాతవ్యం న దాతవ్యం
న కర్తవ్యం చ కించన
సాన్త్వమేకం ప్రయోక్తవ్యం
సర్వం తస్య వశే జగత్.

౨౭

అగ్నిష్టోమే కిముక్థ్యే కిం
కిమాజ్యే కిం రథన్తరే
స్తుతిరిత్యేవ హృష్యన్తి
సర్వజ్ఞా అపి దేవతాః

౨౮

న జాతిరూపకర్మాణి
దృశ్యన్తే మృదుభాషిణి
పక్షిణో మలినాస్తత్ర
పరపుష్టా నిదర్శనమ్.

౨౫

గీ॥ దృశ్య మగు విశ్వ మఖిలంబు ద్వివిధ మగుచు
నలరుచుండెడు నామరూపాత్మకముగ
దాన నాద్యంబునకును సత్కవి ద్వితీయ
మునకుఁ దలపోయఁ బరమేష్ఠియును బ్రణేత.

౨౬

గీ॥ ఈయ నక్కఱ లేదు గ్రహింపవలెను
నదియులే దేమి సేయ నైనదియు లేదు
సాంత్వనోక్తులు బల్కిన జాలు లోక
మఖిల మాజ్ఞానువర్తియౌ నహరహంబు

౨౭

క॥ ఇల నగ్నిష్టోమోక్థ్య
ములనాజ్యరథంతరములఁ బ్రోత్సున దేవా!
లలి నాత్మస్తవ మనియే
యలరుట సర్వజ్ఞు లయ్యు నమరవరేణ్యుల్.

౨౮

గీ॥ జాతిరూపక్రియాదు లెఱుఁచకయు మధుర
భాషణునిఁ గూర్చి జగము సంతోష మొందు
బక్షిగణమున మలిన మౌ పరభృతంబె
దాని కరయంగ ప్రబలనిదర్శనంబు.

సభారంజనము.

౨౯

జిఘాంసన్తోఽపి పశవో
రుదన్తోఽపి స్తనంధయాః
ఘ్నన్తోఽపి రిపవో యుద్ధే
వశమాయాన్తి సాన్త్వతః.

౩౦

అర్థహీనోఽపి మధురః
శబ్దో లోకప్రియంకరః
వీణావేణుమృదంగాదీ
న్యత్రోదాహరణాని నః

౩౦

దాతుః ప్రతిగృహీతుశ్చ
యథా హస్తావుత్తరాధరా
తయోరప్యుత్తరాధర్యం
తాభ్యామేవోపపద్యతే.

౩౧

అమర్త్యాః సన్తు మర్త్యా వా
చేతనాః సన్త్వచేతనాః
దానమేవ పురస్కృత్య
స్తూయన్తే భువనైస్త్రిభిః.

-౨౯-

గీ॥ తనను జంపంగవచ్చు శాత్రవుండైన
మిత్రుంగఁ బైఁబడియెడు పుండరీక మైన
పోరువెట్టెడు చిన్నారిబుడుతఁ డైనఁ
బరమశాంతివహించు సాంత్వనము చేత.

30

గీ॥ అర్థసందర్భవిరహిత మైనయేని
మధురశబ్దము లోకసమ్మోదకరంబు
వేణువీణామృదంగాదివివిధవాద్య
నిస్వనంబులె తలంప దానికిని సాక్షి.

3౧

గీ॥ తనర నిచ్చెడు మఱఁ బుచ్చికొనెడువారి
యుత్తరాధర మగు కరయుగ్మకంబె
తలఁపఁగా వారి యౌత్తరాధర్యభావ
ములను విశదీకరింప నెప్పుడును జాలు.

3౨

క॥ సుర లైన నరులె యైనను
స్థిరచరముల నేది యైనఁ జింతింపంగా
వరదానపురస్కృతి మై
కరము నుతింగ నెడు ముజ్జగంబులచేతన్.

౩౩

దేయద్రవ్యమియత్తా వా
దానోత్కర్షే న కారణమ్
కిం త్వవచ్ఛేదరాహిత్యం
ధనదాంబుదయోరివ.

౩౪

దదాతిరాదదాతిశ్చ
ద్వావేతౌ పరమాద్భుతౌ
యయోః స్వామ్యం చ దాస్యం చ
లీలామాత్రవిజృమ్భితమ్.

౩౫

దోషా అపి గుణాయన్తే
దాతారం సముపాశ్రితాః
కాలిమానం కిలాలమ్బ్య
నీలమేఘ ఇతి స్తుతిః.

౩౬

కిం దాతురఖిలైర్దోషైః
కిం లుబ్ధస్యాఖిలైర్గుణైః
న లోభాదధికో దోషో
న దానాదధికో గుణః.

౩౩

క॥ ధన మీఁదగ్గది తలఁపఁగ
ధనపరిమితి దానసారతకు హేతువుగా
దనయుం బీఁక నే మనఁగా
ధనదునివలె నబ్ధమట్లు తగ నిచ్చుటయే.

౩౪

గీ॥ స్వామ్యదాస్యంబు లవని నెవ్వాని వైన
చిత్రలీలావిలాసవిజృంభితములొ
అట్టి దానంబు స్వీకార మనెడు రెండు
నహహ పరికింపఁగాఁ బరమాద్భుతములు.

౩౫

గీ॥ అపగుణము లేని దాతసమాశ్రయమున
మహితగుణపుంజ మగుచు నిమ్మహిఁ దనర్చు
నంబుదాలంబకాళిమ నార్యజనులు
నీలవర్ణం బటంచు వర్ణింతురుగాదె.

౩౬

గీ॥ ఎన్ని సుగుణాలు లోభియందున్న నేమి
యెన్ని దుర్గుణములు దాత కున్న నేమి
పరమదోషంబు లేదు లౌభ్యమునకన్న
దానమునకన్న గుణము నిద్ధరణి లేదు.

౩౮

అర్థాః సాధారణా ఏవ
విముజ్యన్తే స్వభావతః
మమతాం త్యజ్యతాం తేషు
మహామాత్సద్యతే యశః.

౩౯

మృతోఽప్యర్థం న మోక్ష్యామి
బద్ధ్వా నేష్యామి మూర్ధని
ఇతి చేత్సుదృఢో లోభః
పాత్రే దేయమశఙ్కితమ్.

౪౦

షష్టిర్దేశాన్తరే లబ్ధ్వా
శతం దత్వాత్ర నైగమే
పాత్రే త్వేకమిహోత్సృజ్య
పరత్రానన్తమాప్యతే.

౪౧

న దత్తే కశ్చిదాదత్తే
స్వాదృష్టం స్వేన భుజ్యతే
నిశ్చేదమాత్రే దాతృత్వే
దృశ్యన్తే కృపణాః కియత్.

౨౦

౩౭

గీ॥ ఒక్కయెడనుండి ధనము వేఱొండుకడకుఁ
దఱలుచుండుట సర్వసాధారణంబు
దానిపైని మమత్వంబు మాననైనఁ
గలిగెడు దిగంతవిశ్రాంతలలితకీర్తి.

౩౮

గీ॥ బొక్కసము నెత్తిపైఁగొంచుఁ బోదుగాని
చావనైనను నే విడఁజాల ననెడు
గట్టిలోభంబె కల దేని కలధనమ్ము
పాత్రులకు నిమ్ము సందేహపడక వేగ.

౩౯

గీ॥ వృద్ధికరునకు నిచట వేయింటి నిచ్చి
యిఱువదిటిఁ బొందఁదగును దేశాంతరమున
నిచట యోగ్యున కొకరూప్య మీయఁ బరము
నం దనంతముగాఁ బొంద నగును సూవె.

౪౦

ఉ. హెచ్చొ లవంబొ యెవ్వనియదృష్టము వాఁడు భుజించుగా కెవం ♦ డిచ్చెడువాఁడు కైకొనున దెవ్వఁడు బుద్ధివిభేదమాత్రమై ♦ వచ్చిన దాతృతాగరిమఁ బాయకి కష్టపుఁ బాటు నూనెడుం ♦ జచ్చినకట్టెవోలె విరసంబుగ లుబ్ధుఁ డదేమి చిత్రమో.

౪౧

స్వాతన్త్ర్యం యది చోరేషు
భోక్తృత్వం యది బన్ధుషు
నిష్కర్షే తు భ్రమః స్వామ్యం
తత్త్యక్త్వా లభ్యతాం యశః.

౪౨

న ధైర్యేణ వినా లక్ష్మీః
న శౌర్యేణ వినా జయః
న జ్ఞానేన వినా మోక్షో
న దానేన వినా యశః.

౪౩

స్వకీయాన్భుజ్జతే మత్స్యాః
స్వాపత్యాని ఫణాధరాః
బలాబలవ్యవస్థేయం
బలిన స్స్వకుతోభయాః.

౪౪

గురుం హత్వా దివం యాతి
తృణం ఛిత్వా పతత్యధః
బలినాం దుర్బలానాం చ
శ్రితయోఽపి ద్విధా స్థితాః.

౪౧

గీ॥ తలఁప పౌరులకును స్వతంత్ర్యంబు కలదు
కలదు భోక్తృత్వ మల బంధుగణములకును
స్వామ్యమునయందు నిశ్చయత్వంబు భ్రాంతి
దాని విడ నైనఁ గలుగు నుద్దండకీర్తి.

౪౨

గీ॥ కలిమి పొసఁగదు ధైర్యసంకలనలేక
జయము కలుగదు శౌర్యవిస్తరతలేక
మోక్ష మబ్బదు జ్ఞానసంపూర్తిలేక
యశము సమకూర దురువదాన్యతయెలేక.

౪౩

గీ॥ మీనములు పెద్దయవి చిన్నవాని మ్రింగు
సంతతిని మ్రింగెడును బిలేశయగణంబు
ధారణి బలాబలవ్యవస్థయన నిదియె
బలముకలవాని కెందును భయములేదు.

౪౪

గీ॥ చెందుచున్నాఁడు దివము దేశికనిహంత
యెనయుచున్నాఁడు నరకము దృణనిహంత
వేదజాలము సైతము ద్వివిధ మగుచు
వెలయు బలియురఁగూర్చి దుర్బలులఁగూర్చి.

౪౫

బాధకా అపి లోకానాం
బలినో బిభ్రతి స్వయమ్
సర్వం బలవతాం పథ్యం
భిషగ్భిరభిధీయతే.

౪౬

బలినో బలినః స్నిహ్యా
న్త్యబలం తు నిగృహ్ణాతే
దావం దీపయతే చణ్డో
దీపం వ్యాహన్తి మారుతః.

౪౭

శుభపాత్రబలలబ్ధాపి
లక్ష్మీః శౌర్యవివర్జితా
శోకేన దహ్యమానాస్తే
షణ్ఢే కులవధూరివ.

౪౮

సర్వత్ర లాల్యతే శూరో
భీరుః సర్వత్ర హస్యతే
పచ్యన్తే కేవలా మేషాః
పూజ్యన్తే యుద్ధదుర్మదాః.

౪౯

౭౫

గీ॥ భువనబాధాకరమ్ములైనవియుఁగూడ
బలియురనుగూర్చి స్వాయముగా భయముఁజెందుఁ
గానసే పల్కుదురు భిషగ్వరులు సైత
మన్నియు బలాధికులకుఁ బథ్యంబు లనుచు.

౭౬

కం॥ బలియుఁడు బలియునితో నె
చ్చెలి యగు బలహీను దుంచుఁ జింతింప మహా
బలుఁడు దవాగ్నిని రేచును
వలఁగొని దీపమ్ము నార్పవైచెడు నకటా.

౭౭

గీ॥ పరిస్ఫుటోదాత్తవిక్రమరహిత యగుచు
లక్ష్మి భాగ్యానుసారత లబ్ధ యైన
వగపుచే సంతతము గృశత్వమున సమయు
జగతి షండాధముని కులసతియుఁబోలె.

౭౮

గీ॥ సంస్తుతుండగు సర్వత్ర శౌర్యశాలి
పంద యెల్లెడలను జంపఁబడుచు నుండు
నన్ని యెడలఁ బథ్యము కేవలాజగణము
పూజ్యములు యుద్ధదుర్మదిములు దలంప

౮౯

భార్యాయాః సుందర శ్శీలో
వేశ్యాయాః సుందరో ధనీ
శ్రీదేవ్యాః సుందర శ్శూరో
భారత్యాః సుందర స్సుధీః.

౯౦

న శౌర్యం శౌర్య మిత్యేవ
స్తూయతే బుద్ధశాలిభిః
కిన్తు నీత్యా సమాశ్లిష్టం
వాఙ్మిత్వ మివ మేధయా.

౯౧

శౌర్యేణ లోకసేవ్యత్వం
శౌర్యేణ క్షితిపాలతా
శౌర్యేణ లభ్యః స్వర్గోఽపి
శౌర్యం కస్య న సాధనమ్

౯౨

సమరేషు నరేన్ద్రాణాం
సవనేషు ద్విజన్మనామ్
ప్రీతికర్మసు నాకినాం
శౌర్యం భవతి భూషణమ్.

౪౯

కం॥ ధనికుండు పడపుందొయ్యాలి
కిని శూరవంతుడు లక్ష్మికిని ధీనిధి వా
గ్వనితామణికినిఁ బ్రియుఁడు భా
వనఁ డర్ధాంగికిని రూపవంతులు తలఁపన్.

౫౦

గీ॥ అంచితమనోజ్ఞవాచాలతాభియుక్త
శేముషినిఁబలె నీతిసంశ్లిష్టమైన
శౌర్యగుణము మిక్కుటముగఁ బ్రశంస సేతు
రధిగతాఖిలవిద్యారహస్యఘనులు

౫౧

గీ॥ అఖిలజనపూజ్యుఁ డగును శౌర్యంబుచేత
భువనపాలకుఁ డగు శౌర్యమునను జేసి
స్వర్గభోగము లభియించు శౌర్యయుక్తి
సాధనముగాదు దేనికి శౌర్య మవని?

౫౨

కం॥ పాలులకు మఖములను భూ
దారులకు న్సమరములను దరుణులకు నలం
కారములయందు శౌర్యం
బారయ వెలలేని భూష యగుచున్న దిలన్.

భారంజనము.

౫౩

శౌర్యేణ తుల్యే కథం వృత్తం
స్వామీ దాస ఇతి ద్విధా
అన్వయవ్యతిరేకాభ్యాం
నీతిరి త్యవధాయ్యతామ్.

౫౪

న జయాయ స్వతః శౌర్యం
కిన్తు నీత్యోపబృంహితమ్
ప్రయుక్తం హి జయత్యత్ర
ప్రయోక్తా న స్వతః క్వచిత్.

౫౫

ఇద మేవ పరం శౌర్యం
ఉపాయై స్త్రిభి రన్వితమ్
ఇద మేవ పరం మౌఖ్యం
ఉపాయై స్త్రిభి రుజ్ఝితమ్.

౫౬

పరాక్రమం తే యుద్ధేషు
సమ మేవోభయే భటాః
విజయన్తే౽భ్యుపాయజ్ఞా
విజీయన్తే తదుజ్ఝితాః.

౨౪౩

గీ॥ శౌర్య ముభయత్ర తుల్య మై సాగుచుండ
స్వామియును దాసుఁ డనుభేద మేమి కలదు?
అన్వయవ్యతిరేకము ననుసరించి
కలిగె నీభేద మన్యముగాదుసుమ్ము.

౨౪౪

గీ॥ అధికనీతిసమన్విత మగుచుగాక
శౌర్యము తెనంత నెప్పుడే జయముఁ గొనదు
అస్త్రవిదుచేఁ బ్రయోగింప నగుచుఁగాక
యస్త్రము తనంత సలుపునే యరివధమ్ము?

౨౪౫

గీ॥ సామదానభేదోపాయసహిత మైన
యదియె విలసిల్లుఁ బరమశౌర్యం బనంగ
నా యుపాయత్రయోపేతం బైన యదియె
పరమశౌర్యంబునా నెన్నఁబడు ధరిత్రి.

౨౪౬

కం॥ ఇరువాగుభటులు ననిలో
సరిగాఁ జూపుదురు శౌర్యసారం బైనన్
వరియించు జయ మువాయ
స్థిరులను వెఱ నోటుపాటు చేరిభజించున్.

౪౭

కిం శాస్త్రైర్బహుధాభ్యస్తైః
కిం చాతుర్యేణ కిం ధియా
కిం శౌర్యేణానివార్యేణ
లలాటే చేన్న లిఖ్యతే.

౪౮

ఘటమానాః కుటుంబేషు
దదతీతి విపశ్చితః
మాఘేషు రమతే లక్ష్మీః
అహో దిష్టస్య చేష్టితమ్.

౪౯

తుల్యం కర్షన్తి పృథివీం
తుల్యం శాస్త్రాణ్యధీయతే
ఉన్మజ్జన్తి నిమజ్జన్తి
దైవస్యైకస్య చేష్టయా.

౫౦

లుభ్యన్తి వితరన్తోపి
కుప్యన్తి సరళా ఽపి
ముహ్యన్తి మతిమన్తోపి
భోక్తుర్భాగ్యవిపర్యయాత్.

౫౭

మ॥ అనివార్యం బగు శౌర్య మేమిఫల మీహాయం ఖాలు
చాతుర్య మే ♦ యొసరించుఁ ధిషణాబలంబు సెది
సేయుఁ సర్వధాభ్యస్తముల్ ♦ ఘనశాస్త్రపరిచ
యంబు లెద్ది పౌనరంగాఁ జేయు ఫాలంబునఁ ♦ వన.
జాతపరిభవుం డెదేని లిఖియించఁ బంగానిచో లేశముఁ

౫౮

గీ॥ పండితాగ్రేసరులు కుటుంబము లయందుఁ
గూడికొని యుండి యైన మిక్కుటముగాఁగ
నిచ్చుచున్నార లని రమియించు చుండు
సిరి జడులయందుఁ గాలదుచ్చేష్ట నకట.

౫౯

గీ॥ తుల్యముగ కష్టపడి భూమి దున్నుచందు
సమముగా నభ్యసింతురి శాస్త్రముల నైన
కొందఱు మునుగుచున్నారు కొంద ఱందుఁ
దేలుచున్నారు నిజనిజాదృష్టవశత.

౬౦

గీ॥ భోక్తృభాగ్యవిపర్యయంబునను జేసి
లోభి యయ్యెడు దానశీలుఁడు దలంప
పాగ్రిహాటగుఁడ యయ్యెడు శాంతమూర్తి
ప్రాజ్ఞశేఖరుఁడును భిన్నభావ మూను

౬౧

అధీయతే విజానన్తి
విగజ్యన్తి ముహుర్ముహుః
నాత్యన్తాయ నివర్తన్తే
నరా వైషమ్యతో విధేః.

౬౨

దోహదై రాలవాలైశ్చ
కియద్వృక్షా నుపాస్మహే
తే తు కాలం ప్రతీక్షన్తే
ఫలపుష్పసమాగమే.

౬౩

కః ప్రసూతే పురోవాతం
కః ప్రేరయతి వారిదమ్
ప్రాప్తే తు శ్రావణే మాసి
భవత్యే కార్ణవం జగత్.

౬౪

కాలః కరోతి కార్యాణి
కాల ఏవ నిహన్తి చ
కరోమీతి విహన్మీతి
మూర్ఖో ముహ్యతి కేవలమ్.

౩.౨

౮౧

గీ॥ విషయసంగ్రహులును శాస్త్రవేదు లగుచుఁ
బదపదమున విరక్తి నూనెదరుగాని
కలుషమతి దైవదుర్విపాకమున నరులు
పూనఁబోవరు కట తీవ్రమోక్షవాంఛ.

౮౨

గీ॥ దోహదములుఘటించి పాదులనుజేసి
చెట్ల నెన్నింటి నిట్లు పాసింపవచ్చు
నవియునుక్త ఫలపుష్పసమాగమమున
నెంతయును గాలమున కెదు రెదురె నూచు,

౮౩

గీ॥ పూర్వవాతంబు నెవ్వాఁడు పొడమఁజేసె
జలధరంబుల నెవఁడు ప్రోత్సాహపఱిచె
శ్రావణము వచ్చినంతన సకలజగము
నగుచు నున్నది యేకజలార్ణవంబు

౮౪

గీ॥ కాలమే సర్వకార్యసంఘటన సేయు
కాలమే సర్వకార్యవిఘ్నత ఘటించు
నిది యెఱుఁగలేక మూఢుఁ డియ్యది ఘటించి
తిది చెఱిచి తంచు మనమున నెంచుచుండు

౬౫

అపి కాలస్య నః కాలః
సోఽపి కాల మపేక్షతే
కర్తుం జగన్నిహర్తుం వా
కాలస్తే స జగత్ప్రభుః

౬౬

కాలః సదాగతి రపి
స్థాయీ వ పరిచేష్టతే
చణ్డమారుతవద్విశ్వ
మధరోత్తరయ న్క్షణాత్

౬౭

కాల శ్చాలయతి ప్రాయః
పణ్డితా న్పామరా నపి
తం చే చ్చికీర్షసి వశే
తితిక్షైవ మహౌషధమ్

౬౮

రన్ధ్రేషు ప్రహరిష్యన్తః
కతి కామాదయో ఽరయః
క్షణా న్నశ్యతి లోకో ఽయం
క్షమా చేన్న నియచ్ఛతి

౬౫

గీ॥ కాలునకుఁ గాలుఁ డగు మహాకాలుఁ డేని
భువననిర్మాణ సంహారముల నొనర్ప
సతము కాలనిరీక్షణ సలుపుచుండుఁ
గావునను కాల మొకఁడె లోకము నియంత

౬౬

గీ॥ చండమారుత మీ ప్రపంచంబు నెల్ల
చిటికెలోపల తలక్రిందు సేయునట్లు
కాల మరయ సదాగతి కలది యయ్యు
సుస్థిరం బైనదాని మచ్చుగనె తోఁచు

౬౭

కం॥ కాలమె పండితులను మూ
ర్ఖుల జలియింపఁజేయు ననవరతం బా
కాలమును వశముపఱుపం
జాలిన దివ్యౌషధంబు క్షమ యొకఁడె సుమీ.

౬౮

గీ॥ ఓర్పె నియమింపకున్నచో నొక్క చిటికె
లోపల నశింపకుండునే లోక మెల్ల
రంధ్రములు దోఁచుచోఁ బ్రహారణము సేయు
ప్రబలకామాదిశత్రువర్గంబుచేత

౬౯

అపకారపరాణా మ
ప్యుపకుర్వన్తి సాధవః
ఛిన్నన్త మపి వృక్ష స్స్వ
చ్ఛాయయా కిం న రక్షతి.

౭౦

స్రవత్త్యేవ సదా జ్ఞానం
స్రవత్త్యేవ సదా తపః
ఛిద్రం ఛిద్రం మనుష్యాణ్య
న చే చ్ఛాదయతి క్షమా.

౭౧

క్షమాం రక్షన్తి యే యత్నా
త్క్షమాం రక్షన్తి తే చిరమ్
క్షమా స్తే నిభృతా యేషు
క్షమా స్తే సర్వకర్మసు.

౭౨

మూర్ఖాః శమయితుం దుఃఖం
సంరమ్భన్తే తత స్తతః
క్షమయైవ నిగృహ్ణాన్తి
ధీరాః సంరమ్భవర్జితాః.

సభారంజనము.

౧౯

గీ॥ శిష్టు లగువారి కెగ్గు చేసినను మఱల
చేయ రపకృతి లగ్గె చేసెదరుగాని
పాదపము తన్ను నఱికెడు వాని కైనఁ
జల్లదన మీయదే నిజచ్ఛాయచేత.

౨౦

గీ॥ కేవలంబుగ నోర్వఁడగింపకున్న
మహితవిజ్ఞానమును వినిర్మలతపస్సు
జాఱిపోవుచు నుండెడు సంతతంబు
సమయమును వేచియున్న రంధ్రములు బొంది.

౨౧

గీ॥ సతత మెవరు కుమారత్క సలుపుచుండుర్రి
సతము వారె కుమారత్క సలుప నగుదు
రనయ మెవరు నిభృతత్వము లరయ వారె
సర్వకార్యత్వముల్ బ్రపంచమునయందు.

౨౨

గీ॥ పైకొనిన దుఃఖభరమును బాపికొనఁగ
మూర్ఖు లెంతయొ సంరంభమును బొనర్తు
ధీరవరు లోర్పుమై దుఃఖభార మెల్ల
సైచెదరు తొట్రుపాటు లేశంబుఁ గనక.

౨౩

ఆకాల్యా దానిశీధాశ్చ
కుత్స్యథేాం వ్యాపిరియామహే
న చ నివృణామో జాతు
శాన్తా స్తు సుఖ మాసతే.

౨౪

నాయస్య న్తి శరీరాణి
న దైన్య మవబుధ్య తే
సంభవత్యపి చానన్దః
శాన్తి మభ్యస్యతాం సతామ్

౨౫

ప్రసీద త్య పరిస్వన్తి
పయః కలుషితం యథా
తథా శాన్త మపి స్వాన్తం
ప్రసీదతి శనైఃశనైః

౨౬

యత్నేన మహతా లభ్యా
దాసా ద్వితాశ్రి సుఖాయ నః
శాన్తస్య కాలాదృష్టాద్యాః
శతం భృత్యా అవేతనాః.

౩౭

౭౩

ఉ॥ జేనెడు పొట్టకోసమయి చిత్తమునం దలపోసి శేఁ
బవ ♦ శ్లోనినరక్తి నెద్దియెదియో ఘటియించుచు
నున్న మాకు సుం ♦ తేనియు సౌఖ్య మబ్బ దదియేమి
పురాకృతమో పరిశాంతు లౌ ♦ మానిసు లూరకే
సుఖసమగ్రిత శోభిలుచుండ్రి నిత్యము౯॥

౭౪

గీ॥ శాన్త్యుపాసకు లైనట్టి సజ్జనులకు
దీనభావమా సుంతేనిఁ దెలియఁబడదు
లేశమేని శరీరముల్ క్లేశపడవు
ఘనతరానందసుఖసమగ్రితయు గలుగు.

౭౫

గీ॥ కలుషితము లైన జలములు కదపకునికిఁ
జేటికొని యెదునట్టు లుద్రిక్తకామ
కలుషితం బగుచిత్తంబు కలఁకఁ దేటి
శుద్ధిఁబొందెడు శాంతివిస్ఫూర్తి నెనసి.

౭౬

గీ॥ అధికయత్నాన నాత్మసౌఖ్యంబుకొఱకు
దాసు లొకరిద్దఱు లభింపఁదగినవారు
కాలభాగ్యాదిభృత్యవర్గము శతంబు
శాంతుఁ డగువానిఁ గొల్చు నిచ్చలు తనంత.

౭౭

అపి మృష్టాన్న గిరా లభ్యః
సదా జాగర్త్య తన్ద్రితః
నాస్తి ధర్మసమో భృత్యః
కించి దుక్తస్తు ధావతి.

౭౮

అర్థేనో పార్జ్యతే ధర్మో
ధర్మేణార్థ ఉపార్జ్యతే
అన్యోన్యాశ్రయణం హ్యేత
దుభయోత్పత్తిసాధనమ్.

౭౯

విపణిః పుణ్యతీర్థాని
విక్రేతార స్త్వకించనాః
తృణేనాప్య స్తకో ధర్మః
పర్వసు క్రీయతే మహాన్.

౮౦

చులుకోదకమాత్రేణ
ధాన్యముష్టివ్యయేన చ
మరుభూమిషు దుర్భిక్షే
ధర్మసస్యం మహాఫలమ్.

౮౧

౭౭

గీ॥ లలితవుం బల్కు బడిచేత లభ్యపడును
జాగరతఁ గానియెుండు నిశ్చలత నెపుడు
జెచ్చెఅం బర్వు లెత్తును జెప్పినంత
వసుధ ధర్మంబుసాటి సేవకుఁడు లేఁడు.

౭౮

గీ॥ ధర్మము గడింపవచ్చును ధనముచేత
ధనము గూర్పంగ నగు ధర్మముననుజేసి
అనయ మీాదృశము పరస్పరాశ్రయంబె
జగతి నేతద్వయోత్పత్తిసాధనంబు.

౭౯

గీ॥ అంగడులు పుణ్యతీర్థముల్ లమ్మువార
లార! పేదలు తృణముచే నైన నేనిఁ
బర్వదినములలో నిరుపద్రవముగ
కోటిధర్మంబు నార్జించుకొనఁగవచ్చు.

౮౦

కం॥ పుడిసెడు జల మొసఁగిననుఁ
బిడికెడు ధాన్యంబు వెచ్చపెట్టిన సుఫలం
బిడు ధర్మసస్య మెలమిం
గడువడి మరుభూమి నైనఁ గలవున నైనన్.

౮౧

౫౧

ధర్మో నర్మసఖః కాలే
గురు స్తత్త్వోపదేశనే
భటః సంగరరఙ్గేషు
సచివో ఽర్థసమార్జనే.

౫౨

భువి వృక్షా దివి చ్ఛాయా
భువి కూపో జలం దివి
భువి యద్గృహ్యతే విప్రై
ర్దివి తద్దీయతే సురైః.

౫౩

కదళీకన్దవ ద్ధర్మో
న రోహతి బహిర్గతః
ఛాదితస్తు ఫలం చారు
సూతే పనసమూలవత్.

౫౪

దుఃఖేనో పార్జ్యతే ధర్మః
సుఖేన తు వినశ్యతి
కృచ్ఛ్రల్లబ్ధ మముం త్రాతుం
నేచ్ఛన్తి మునయః సుఖమ్.

౫౫

౮౧

గీ॥ కోరికెలుదీర్ప నర్మసఖుండువోలె
దేశికునివలె తత్త్వోపదేశమందు
భటునివలె నని విత్తసంపాదనమున
సచివుఁడునువలె ధర్మము సాయపడును.

౮౨

గీ॥ భువిని వృక్షంబులును దివంబునను నీడ
భువిని కూపంబులును దివంబున జలంబు
నవనిసురు లెద్ది భూమిపై ననుభవింతురి
దానిఫల మిచ్చెదరు దేవతలు దివమున.

౮౩

గీ॥ బయలుఁబడి ధర్మ మరటిదుంపయునువోలె
నంకరింపంగఁబో దొరకయుప్ప డేని
పనసమూలంబువలె కప్పఁబడిన దగుచు
బరిణతము సుందరము నైన ఫలము నీను.

౮౪

గీ॥ ప్రబలకష్టార్జితంబు ధర్మము సమస్త
మైహికసుఖానుభవముచే నంతరించుఁ
గాన తద్ధర్మరక్షాపరికాష్టబుద్ధి
నిచ్ఛ సేయరు మాను లైహికసుఖంబు.

౭౪

సంపాద్యతాం వా యత్నేన
యాద్వా విక్రీయతా మయమ్
సర్వదా భుజ్యతాం వాన్యై
ర్ధర్మో భవతి నాన్యథా.

౭౫

అర్థవన్తః ప్రశస్యన్తే
నిన్ద్యన్తే తద్వినాకృతాః
ఆగమేష్వపి చేదేవ
మద్భుతం కిం శరీరిషు.

౭౬

అర్థోఽప్యర్థేన చేత్సాధ్యః
కా వార్తా ధర్మకామయోః
అర్థః సర్వజగన్మూల
మనర్థోఽర్థవిపర్యయః

౭౭

కర్మ జ్ఞానం చ మోక్షాయ
కర్మణ్యర్థోఽధికారితా
అతోఽర్థేనైవ కైవల్యం
న కైవల్యేన లభ్యతే.

౭౮

౨౫

గీ॥ చిరము యత్నంబుచేత నార్జింప నైన
నితరజనముల కొగి విక్రయింప నైన
చెలఁగి పరు లెంతపెల్లు భుజింప నైన
దఱుగదు నశింపఁబోవదు ధర్మ మెపుడు.

౨౬

గీ॥ అర్థవత్వంబ కష్టఁ బ్రశంసార్హ మర్థ
హీనతయె సర్వదా నింద్య మిలఁ దలంప
నాగమములందె యిట్లుండ నైన నింకఁ
గలుగు నెద్దివచింప దేహులను గూర్చి.

౨౭

గీ॥ అర్థమున నర్థమే సాధ్యమగుచు నుండ
ధర్మకామంబులనుగూర్చి తడవ నేల
ధాత్రికంతకు మూల మర్థంబు నూవె
తద్విపర్యయమున ననర్థములు మూఁడు.

౨౮

గీ॥ కర్మమును జ్ఞాన మనెడు మార్గద్వయంబు
కలదు మోక్షంబునొందఁ దత్కర్మమునకు
ధనము ముఖ్యంబు కావున ధనమునందు
కలదు మోక్షంబు లేదు మోక్షమున ధనము.

సభారంజనము.

౮౯

కథమర్థం నిషేధన్తు
శ్రుతయః స్మృతయోపి వా
యాసామేకం పదమపి
న చలత్యర్థతో వినా.

౯౦

లక్ష్మీశ ఇతి గోవిన్దో
మేరుధన్వేతి శంకరః
హిరణ్యగర్భ ఇత్యేవ
బ్రహ్మాపి బహుమన్యతే.

౯౧

ఊర్ద్వం గచ్ఛన్తి యం త్యక్త్వా
యం గృహీత్వా పతత్యధః
తస్య గౌరవమర్థస్య
తావత్తైవా నుమీయతామ్.

౯౨

దృష్టదోషోఽపి గార్హస్థ్యే
దూరదర్శితయా స్వయమ్
గార్హస్థ్యమేవ పరమం
మేనే నైయాయికో మునిః.

౯౩

౮౯

గీ॥ అర్థహీనంబుగా వేని నైన పద మొ
కండునేని చలింపఁ దెక్కడను నట్టి
శ్రుతులె యైనను స్మృతులసంతతులె యైన
నంచితార్థంబులను నిషేధించు నెట్లు.

౯౦

గీ॥ ఎలమి మధుసూదనుండు లక్ష్మీశుఁ డనుచు
ద్రవ్యంబకుం డారయఁగ మేరుధన్వి యనుచుఁ
గమలసంభూతుఁడు హిరణ్యగర్భుఁ డనుచుఁ
బొందుచున్నారు గౌరవంబును ధరిత్రి.

౯౧

గీ॥ దేని సంత్యాగ ముత్తమస్థితినిఁగూర్చు
దేని సంగ్రహ మధమస్థితిని ఘటించుఁ
దలఁప నాద్రవ్యపుం గొప్పతనము దాని
చేతనే మిక్కిలిగ నూహసేయవచ్చు.

౯౨

గీ॥ తనకుఁదా గౌతముఁడు దీర్ఘదర్శి యగుట
నఖిలదోషాన్వితంబు గార్హస్థ్య మనుచు
వరసిశోనియును దుదకు గార్హస్థ్య మొకఁడె
మహిత మని యెంచె నాశ్రమములలోన.

౯౩

గృహిణా యది లభ్యేత
గృహిణీ హృదయఙ్గమా
సంసార ఇతి కో భార
స్తం సారమనుపశ్యతః

ఆహాత్య చినుమః స్వర్గ
మాపవర్గమపి క్రియాత్
అనుకూలే హి దాంపత్యే
ప్రతికూలే న కించన.

౯౪

గృహిణీవృత్తదోషేణ
గాఢమాత్యంతతాపితః
ఆతస్థే దుఃఖవిధ్వంసం
కైవల్యం పరమం మునిః

౯౬

అపి యత్పరమం తత్వ
మర్ధేన్దుకృతశేఖరమ్
తస్యాపి తావానానన్దః
కిమస్మజ్జననీం వినా.

౯౩

గీ॥ పరమహృదయంగమయుఁ బతిప్రాణ మైన
భార్య లభియించెనేని గృహపతికి మిగుల
సారత మానెకాని సంసార మెల్ల
భంగిని నొగవ్వ డేనియు భార మగును.

౯౪

గీ॥ జనయ మనుకూలదాంపత్య మైన యెడల
క్రమముగాఁ బొందగల్గు స్వర్గమును మోక్ష
మది తలంపఁగ విపరీత మైన యేని
కలుగఁబోదు సుఖం బైహికమున నేని.

౯౫

గీ॥ తలఁప నర్ధాంగి దుశ్చరితంబు చేతఁ
దాపితుం డయి మున్ను గౌతమతపస్వి
వ్యసనవిధ్వంసనం బె కైవల్య మనుచుఁ
గ్రిమత నూహించి నిర్విచారముగ నుండె.

౯౬

గీ॥ చింతసేయంగ బాలేందుశేఖరుండు
పరమతత్త్వస్వరూపభాసురుఁడె యైన
సతియు నాతల్లి యైన పార్వతియె లేక
యాతని కంతటి యానంద మబ్బఁగలదె?

౯౭

నిన్దన్తి చ ప్రశంసన్తి
నిగమా యద్గృహాశ్రమమ్
దామ్పత్యసామ్యవైషమ్య
భేదాదేతద్వ్యవస్థితిః.

౯౮

ఇన్ద్రియాణ్యనుపక్లేశ్య
లభ్యం శ్రేయో గృహాశ్రమే
అతస్తుయాఽఽశ్రమం ప్రాహు
రబాధన్యాయబాధితమ్.

౯౯

భుజ్యతే యత్సుఖం ధీరై
రప్రమత్తైర్గృహాశ్రమే
స్వర్గస్తస్యాగ్రజసంపూర్తే
రపవర్గోఽస్య నిత్యతా.

౧౦౦

ఉచ్చావచం జగద్గ్రాంథస్య
మేకథైవ నిషేధతి
పరివిష్టమాత్రో నృపతిః
పరిపంచమివ నశ్యతి.

౯౭

గీ॥ ఒకట నిందించుఁ గొన్నియెడను నొక్కచోట
మొదలిమిన్నకులు గార్హస్థ్యమును గణించి
సామ్యవైషమ్యదాంపత్యసన్నివేశ
ములె తెలంపఁగఁ దద్వ్యవస్థలకుఁ గతము.

౯౮

గీ॥ తలఁప గార్హస్థ్యమున శుభంబులను బొంద
శ్రమకుఁ బాల్పేయువలె నింద్రియముల నెల్ల
దానసే యెట్టి బాధావిధంబులేని
దనఘము తురీయ మాశ్రమం బంద్రు బుధులు.

౯౯

చ॥ స్థిరముగ నప్రమత్తు లగుధీరులచేత గృహాశ్రమంబు
నన్ ♦ వెరవుగ నేసుఖం బనుభవింపఁగ నయ్యెడు
దాని కంగవి ♦ స్ఫురణ మనేకభంగి కడముట్టుటయే
త్రిదివంబు తత్సుఖ ♦ స్ఫురణము శాశ్వతం బగుటెపో
యపవర్గము చింతసేయఁగన్.

౧౦౦

గీ॥ తీవ్రమైన ప్రపంచదుస్థితిని వేద
మొకట నెట్లూచముట్టుగా నూడ్చివైచు
నట్లె రాజేంద్రుఁడు బ్రవిష్టుఁ డగుచునుండి
సకల మిహాలోకదుస్థితి సమయఁజేయు.

౧౦౧

న రాజానం వినా రాజ్యం
బలవత్స్వపి మన్త్రిషు
ప్రాణేష్వసత్సు కిం దేహ
శ్చేష్టావా తేన ధార్యతే.

౧౦౨

మాతుః కించిత్పితుః కించి
దాచార్యాత్కించిదాప్యతే
సమ్యగ్వినీతాచ్ఛాస్త్రేషు
సర్వం రాజ్ఞస్తు లభ్యతే.

౧౦౩

చలన్తి సర్వమర్యాదా
శ్చలితే సతి పార్థివే
పర్వతా అపి కమ్పన్తే
ప్రసక్తే కంపనే భువః.

౧౦౪

పత్న్యా మాఙ్గల్యయోగేన
పత్యురాయుః ప్రవర్ధతే
ప్రకృతీనాన్తు భాగ్యేన
పార్థివః సుఖమేధతే.

౧౦౧

గీ॥ ఇత్థబలదర్పితులు మంత్రు లెంద ఉన్న
రాజ్యసుస్థితి పొసఁగదు రాజులేక
చెలఁగి సుడిగాడ్పు లెంతవీచినను గాని
ప్రాణవాయువులేక దేహంబు మనునె.

౧౦౨

గీ॥ తల్లిచేఁ గొంతయును గొంత తండ్రిచేతఁ
గొంత గురువరుచేతఁ జేకురుచు నుండు
శాస్త్రశిక్షితుఁ డైన భూజానిచేత
నునయమును సర్వధర్మంబులును లభించు.

౧౦౩

గీ॥ చటులభూకంప మొదవెడు సమయమందు
భూమిధరములు కంపముం బొందునటుల
భూరమణునుఁ డాత్మధర్మము మీఱె నేని
సకల మిహలోకధర్మంబు సన్నగిల్లు.

౧౦౪

గీ॥ భార్యమాంగల్యయోగసంపదను జేసి
భర్త కాయుఃప్రవృద్ధి చేపడెడునటుల
ప్రకృతిజనుల మహాభాగ్యవశముచేత
నవనితలపతి సౌఖ్యంబు లందుచుండు.

నిర్మితం శతకం సాగ్రం
నీలకంఠేన యజ్వనా
సభారంజనమేతేన
సాధయన్తు మనీషిణః.

సంపూర్ణమ్.

౧౦౫

గీ॥ చారుకవితాకళావేది సాంగవేది
యైన శ్రీ నీలకంఠమహాకవీంద్రు
చేత విరచిత మగు దీనిచేత బుధులు
కడగిఁ రంజింపఁజేతురుగాక సభలు.

౧౦౬

గీ॥ అమరభారతి నీలకంఠాఖ్యసుకవి
రచితశతకము శ్రీ సభారంజనమున
కాంధ్ర మిది విబుధాగ్రణు లౌననంగ
వ్రాసినాఁడను వేంకటరత్నకవిని.

౧౦౭

క॥ శ్రీ నీలకంఠమఖి వి
ద్యానిధి కృపకలిమి నహరహం బిది బుధసం
తానామోదాస్పదసరి
ద్వానీరం బగుచు జగతి వర్ధిలుగాతన్.

# గద్య

ఇది శ్రీరామచంద్రకరుణాకటాక్షలబ్ధసరసకవితా
ధురీణ హారితమునీంద్రగోత్రపవిత్ర మక్కి
పాట్యన్వయాబ్ధిచంద్ర నాగమాంబా